శ్రీరస్తు.

స్త్రీల కత్యంతోపయోగంబుగ

ప్రాచీన కవి పుంగవులచే

రచియింపఁబడిన




# రుక్మిణీదేవి సీమంతము.



ఇయ్యది

పోతాప్రగడ వేంకటరత్నమ్మగారిచే

విశాఖపట్టణమందు

శ్రీశారదాముకుట ముద్రాక్షరశాలలో

ముద్రింపించి ప్రకటింపంబడియె.

500 కాపీలు.

వెల 1 అణా.

VIZAGAPATAM:

Printed by A. Venkatareddy, at the S. S. M. Press.

1897.




శ్రీరస్తు.

స్త్రీల కత్యంతోపయోగంబుగ
ప్రాచీన కవి పుంగవులచే
రచియింపఁబడిన

# రుక్మిణీదేవి సీమంతము.

ఇయ్యది
పోతాప్రగడ వేంకటరత్నమ్మగారిచే


విశాఖపట్టణమందు
శ్రీ శారదాముకుట ముద్రాక్షరశాలలో
ముద్రింపించి ప్రకటింపఁబడియె.

వెల 1 అణా.

VIZAGAPATAM:

Printed by A. Venkatareddy, at the S. S. M. Press

1897.



శుభమస్తు.



# రుక్మిణీ దేవి సీమంతము.



శ్రీకృష్ణుని రాణికినీ శ్రీరుక్మిణీదేవికినీ। ఇంతికి గర్భపు చిన్నెలు వింతలుగా నైకొనెనూ। ఒకలింతలు ఘనమాయెను శ్రీకాంతుని రాణికినీ। చేకొని గోడలమృత్తిక భక్షింపుచునుండే। అన్నముయించుక తినదూ ఆకలిపలుమారనదూ। పట్టెడి దర్బెడినైకొని నెలతరో ప్రొద్దులుబుచ్చా। శుభకంఠము సన్నమాయెను శుభకోమలాంగికనిపుడూ। స్వారపు ఫలములమీదనె కోరిక లగ్గలమాయే। ఆవలింతలు ఘనమాయెను శ్రీకాంతుని రాణికినీ। పణతీపట్టిమంచముపై పలుమారూ పవళించూ। ఆచందము గని చెలులూ యింతికి తామిట్లనిరీ। నీవున్నా విధములు మరి మాకేమీ తెలిసుండవు। అన్నము నించుక తినవూ ఆకలి పలుమారనవూ। పట్టెడి దర్బెడి నైకొని నెలతరో ప్రొద్దులు బుత్తూ। శుభకంఠము సన్నమాయెను శ్రీలక్ష్మీరాణీకనూ। శ్రీకృష్ణుడు విన్నా మరికోపించునో యేమనునో। ముగిదె నీవు నీళ్ళోసుకు మునుకొని మూడు నెలలాయే। ఇంతికి గర్భము నిజమని యెంతో సంతోషించ్రీ। ఎంతో సంతోషించీ యశోదకు నెరిగించ్రీ। మీకోడలివిధములు మరిమాకేమని తెలిసుండవు। అన్నము నించుక తినదూ ఆకలి పలుమారనదూ। పట్టెడిదర్బెడినైకొని నెలతరో ప్రొద్దులుబుచ్చా। శుభకంఠముసన్నమాయెను శుభకోమలాంగికనిపుడూ। స్వారపుఫలములమీదనె కోరికలగ్గలమాయే। ఆపలుకులువిని దేవకి యెంతో సంతోషించే। తన

ముద్దూకోడలినీతనవగ్గర బిలచుకొనీ। కుచములనందముకులగిరులూ హేమకలశమ్ములబోలూ। బింబము పాండురవర్ణముబోలున్నదిని జమనెనూ। కావలసినవస్తువులూ ప్రేమతో తాదెప్పించీ। కావలసి నవస్తువులూ చెయమని చెలులకు జెప్పే। అంతటజెలులతో రుక్మి ణి బంగరు మేడలకేగే। సంపెగ తైలము రుక్మిణి దేవికినీ శిరసం ట్రీ। గంధమ్మూ కస్తూరీ కాంతకు నలుగులు బెట్టీ। సుగంధజల ములరుక్మిణిదేవికి జలకములార్చీ। నిండువన్నె తెళ్ళోత్తిరి నీరజా క్షికి వేడుకతో। బంగరు పటుపీతాంబరము కట్టనిచ్చిరి వేడుకలా। సకియకు తలకురులార్చిరి సంపెంగా విరులానూ। బంగరు మొగలి రేకులతో పటుసవరములో కొప్పిడీ। ఇరుగడలా సూర్యాచంద్రా దుల నమరగనిలిపి। హరిచ్చంద్రాముత్యాలాబొట్టు మెరియగా బె ట్టీ। కేళించిన అణిముత్యాలా బావిలీలుమెరయగనూ। శశిపుష్ప మరగనుంచెను చంద్రవదనవేడుకతో। మోపునతీగెలుబెట్టెను ము ద్దరాలువేడుకలా। ఒడ్డాణంబులు బెట్టెను వైడూర్యంబులు వెలు గా। ఒత్తులుభుజకీర్తులు సందెటిదండలువెలుగా। పాదంబునయం దెలు పాయినట్టములూ మెరయగనూ। నెమలదుగులపిల్లాళ్ళా న వముద్రికలు మోగియగనూ। చిటికెన బొద్దులు బెట్టెను శ్రీరు క్మిణి తనవేళ్ళా। పంచరత్నంబుల బటువులు పంకజాక్షీ ధరి యించీ। కస్తురితిలకముదిద్దెను కమలాక్షీతననుదుటా। సోగకన్ను లను కన్నపుకాటుకలమరగదిద్దే। చేడెకుచంద్రాకావిరవికెదొడగి రివేడుకతో। శృంగారంబులుజేసిరిశ్రీరుక్మిణిదేవికినీ। అంగనముంద రబంగరుపళ్లెరములు దెచ్చించీ। దివ్యాన్నంబులు పెరుగూ పిండి వంటలుకూరగాయలనూ। పచ్చళ్ళామొదలైనా పంచభక్ష్యపర మాన్నములూ। దధిమధుఘృత సూపంబులు వడ్డించిరి యింతులు నూ। ఆదధిఘృత సూపంబులువడ్డించిరి పణతులనూ। ఆరగించిశ్రీ

రుక్మిణి హస్తంబులు గదుకుకొని। శ్రీకృష్ణుడు యుండేటి చిత్తరు
మేడలకేగే। ఇరుగడలా ముత్యాలా చిత్తరవ్వా పందిళ్ళా। ఇరు
గడలారత్నాలా చిత్తరవుల కిటికీలూ। బంగరుపటువస్త్రమును దెచ్చి
పానుపుపైపరగావించి। పారిజాతకుసుమంబులు పానుపుపై పర
పించి। పవళించెను శ్రీరుక్మిణి పంకజాక్షి వేడుకతో। అతివలుయి
ద్దరు గూడుకు ఆకులుమడచియ్యగనూ। పణతులు యిద్దరు గూడు
కు పాదమ్ములు బట్టగనూ। వనితలు యిద్దరు గూడుకు వీవనలను
విసరగనూ। ఇందుముఖులెల్లాగూడుకు తమ కొలువులు శాయగ
నూ। పవళించెను శ్రీరుక్మిణి పంకజాక్షి వేడుకతో। అంతటవసుదే
వుడు తన సఖి దాయకు యేతెంచి। మహి ఆరు నెలలాయెనా
మనరుక్మిణిదేవికిని। చేడెకుసీమంతమ్ములు శాయగవలెనని పలికే।
శ్రీకృష్ణుడు యేడనుచూ అడిగెనువసుదేవుండూ। ఆరునెలలాయె
నుకృష్ణుడు అంగటికే రాలేదూ। ఏవేళా శ్రీకృష్ణుడు వేలాస్త్రీల
తో యుంటూ। పదియారువేలకు కృష్ణుడు లోలుండై తిరుగుచునుం
డూ। ఒప్పరు యిదినామనసుకు ఒప్పదనుచు తాబలికే। ఆపలుకు
లువినిజనులూ అతిభయపడుతూవెళ్ళి। రాజనగరులన్ని వెదకిరి రా
మకృష్ణుల నప్పుడూ। సత్యాంగనతో కృష్ణుడు సరసమాడుచునుండ
గనూ। స్తంభాలచాటుననిలచి కనుసంజ్ఞలుచేయుదురూ। కనుసం
జ్ఞలవారికినిచెలియసంజ్ఞలజెప్పంపే। భామామణిరో సత్యాభామా
మణిరో వినవే। మనభక్తుడు అక్రూరుడు మనకువిందులమరించే। ఆ
రగించివచ్చెనే అతిశీఘ్రమ్మున నేనూ। మజ్జన భోజనమ్ములకే సజ్జప
రుచుకుయుండుమనెనూ। ఆపలుకులువినిచెలియా పతిముఖమే తా
జూచి। వేగపోయిరాకృష్ణా వేగపోయిరమ్మనెనూ। తనసతిపలుకు
లకూ చాలాసంతోషించి। శృంగారమ్ములుఆయెను శ్రీకృష్ణుడు వేడు
కతో। చీనిచీనాంబ్రముగట్టెనుదివ్యమైనసొమ్ములుబెట్టే। శిరస్సునర

త్నకిరీటముధగధగ మెరయగనుంచే। వక్షమ్మున శ్రీతులసీవనమాలిక ధరియించీ। కౌస్తుభాభరణపతక ముకర్ణకుండలమ్ములు మెరయా। మకరకుండలమ్ములు బెట్టైను పరివీధులు మెరయగనూ। శంఖచక్రగజపద్మమ్ములు అంబుజచతుర్భుజసఖుడూ। బంగరుపువ్వులశాలూ వల్లెవాటుగావేసే। ఉరమునసబంగారూ ఉత్తరజందెము వేసే। చిలుకచేతబట్టుకొనీ పలికించూకుంటూనూ। వేణునాదమ్ముల నాదము నాదమ్ములనూదుచునూ। నాదమ్ములు విని గోవులు గోపాలకులే తెంచీ। డికర్రింపుచుతనచెవులా డికర్రింపుచువింటూనూ। సవ్వచు గోవులశిరసులుదువ్వుచు గోపాలుండూ। వచ్చీతండ్రికి మొక్కెను వనజాక్షుడు వేడుకతో। పాదపద్మంబులనున్నా తనయుణ్ని దీవించీ। ఆలింగనంబులు జేసుకు అంబుజాక్షునికిట్లనెనూ। ఏమిర శ్రీకృష్ణా మెన్నడుయింటికి రావూ। ఆరునెలలాయెను నీవునా అంగటికే రాలేదూ। వేడుకతో కొమాళ్లగని యెటి వేళలాయె రానాతండ్రీ। బాలుడవైతిరిగేవు గోపాలకులనుగూడీ। తండ్రిచేత శ్రీకృష్ణుడు తగుదీవెనలందుకునీ। వచ్చీతల్లికిమొక్కెనువనజాక్షుడు వేడుకతో। పాదపద్మంబులనున్నా తనయుణ్ని దీవించీ। ఆలింగనంబులు జేసుకు అంబుజాక్షి యిట్లనెనూ। ఏమిర శ్రీకృష్ణా మెన్నడు యింటికి రావూ। ఆరునెలలాయెను నీవునా అంగటికే రాలేదూ। వేడుకతో కొమాళ్లనుగని యేటి వేళలాయె రానాతండ్రీ। బాలుడవైతిరిగేవూ గోపాలకులనుగూడీ। తల్లిచేత శ్రీకృష్ణుడుతగుదీవెనలందుకునీ। మేలిమైనకనకంపూమేడలవరికే తెంచే। అంతటసత్యాంగనతన కాంత చెలిని బిలుచుకొనీ। అతివరొ వినవే కృష్ణుడు యెచ్చటికేగెనొ తానూ। అక్రూరుని యింటికివిందులుఆరగించవతెనానీ। అక్కరొ కృష్ణుడుజెప్పీ యెకడికేగెనో తానూ। హరియెక్కడ నున్నాడో ఆ వృత్తాంతము తెలియా। అతివేగమ్మునగమ్మని చెప్పంపెను చెలితానూ।

సత్యాంగనబంపినచెలియా సరగునతానేతెంచీ। మేలిమైన కనకం
పూమేడలదరికేతెంచే। ఇరుగడలాముత్యాలాఒత్త్రరవ్వలకిటికీలూ।
బంగరుకిటికిల చాటునదాగెనుచెలితానూ। అంతటశ్రీకృష్ణుడుత
నసతిదాయకునేతెంచే। నిద్రించియున్నట్టియొ నీరజాక్షిని పొడగ
నెనూ। స్త్రీలకు ముఖశృంగారము యెడ ముత్యమ్ములు గలవా।
భూషణమ్ములు గలవింకా భన్నస్వరములుగలవూ। స్త్రీలకు ముఖ
శృంగారము చూడను తానెన్నడనూ। అతివకుముఖమునచెమటని
హరితానప్పుడు దెలసీ। తాగప్పినబంగారూ శాలూ చెంగన దు
డచే। హరిచెమటలు దుడవగానే అతివతాను మేల్కొనెనూ। అ
పరాధములని కృష్ణునిపాదమ్ములకేయొరగే। నవరత్నపు సింహాసన
మ్మున కూర్చుండగ తాబెట్టే॥ లోహాసనమ్మున కృష్ణుని పాదమ్ములు
తాగడిగే। పాదతీర్థమ్ములు తానూ పైజల్లూకొనెనూ। వీవనలను
పుచ్చుకునీ విసరెను తెనపతికపుడూ। పతితెన మోహమ్మైన అ
తివముఖము తాజూచీ। పసిడిపళ్లాకైనట్టి తళతళనేత్రనిజూచీ। ఇ
న్నాళ్లావలెగాదే ఇంతిరోనీకసియాడీ। నడుమేపోడుగైయున్నది
విడువకయుంది యేమనెనూ। అనికృష్ణుడు బలుకగనూ విని రుక్మిణి
సిగ్గుననూ। తలవంచుకు యున్నట్టీ సతికరములు తాబట్టీ। గంధ
మ్మూకస్తూరీ కలపముగాగను జేసీ। ముగిదదాడగిన ముత్యాలారవి
కా ముళ్లను తావిప్పే। మేనుగంధము అలదుచునూ మేన గోరు
జల్లుచునూ। ఇన్నాళ్లావలెగాదె ఇంతిరో నీకుచగిరులూ। హేమక
లశమ్ములబోలెటి విచ్చైయున్నవిమేమే। అనికృష్ణుడుపలుకగనూ వి
నిరుక్మిణిసిగ్గుననూ। తలవంచుకు యున్నట్టీ సతికరములు తాబట్టీ।
గంధమ్మూ కస్తూరీ కలపముగాగను జేసీ। నాతిరో నీనాకరములు
మోరుపెవ్వరివనియడిగే। అనికృష్ణుడు పలుకగనూ వినిరుక్మిణినవ్వు
చునూ। కస్తురికన్నా మెరుపూకమలనాభా మీకరమూ। కస్తురిక

న్నా యెరుపని కడుహాస్యము చేయుదువా। తాజన్మించేటప్పుడుమ
థురలోపలానింకా। తల్లికితండ్రికి వేసిన సంకెళ్లప్పుడువిడెనూ। పు
ట్టితియీధరలోపల పురుషుడనై మీకొరకూ। కష్టజాతులకూ నె
ల్లా గతులెల్లాగనపడగా। తనుతండ్రీ వసుదేవుడు తనుతోడుకు
రాగానూ। రేపల్లెవాకిటనూ యశోదకడనున్నా। యోగమూను
నీతెమ్మని తాఖంపెను శౌరితానూ। రాపచెట్టప్పుడు గదలెను గార్ద
భమప్పుడు గూసే। కాపున్నవారంతా కంసున కెరిగించిరిగా। ఆ
మాటలు వినికంసుడు ప్రాణమ్ములుమూర్ఛల్లే। తాఁడ్డామూర్ఛాలు
తనలోనే తెలుసుకొని। తలముడివిడిపోగానూ ఖడ్గము చేబట్టుకని।
పురిటింటికిజేరగ తావచ్చెను కంసుండపుడూ। వచ్చినకంసునిజూచి
వసుదేవి యిట్లనెనూ। అన్నరో వినరాయిది ఆడబిడ్డది గదరా।
మొగశిశువూ కాదుగదా నినువధియించే కొరకూ। అని చన్నాన
బాలిచ్చుచూ కరముననద్దూకొనుచూ। అంతట వేకంసుడు తాఁబా
లిక చెయిబట్టీడ్చే। గిరగిరత్రిప్పాకాశముపొడుగున యెగరగవేసే।
త్రుళ్లకురాయోరికంసా ఏలత్రుళ్లేవురయికనూ। నినుజంపెటవైరీ
రేపల్లెలో పెరిగేనూ। ఆపలుకులువినికంసుని ప్రాణమ్ములుమూర్ఛి
ల్లే। కొంతతడవుకా మూర్ఛాగొని తానప్పుడు దెలిసే। పన్న
గశయనుడగుచ్చిజంపితి పాపమునొడిగట్టుకుంటీ। ప్రాణమ్ములకే నో
డితి నని కంసుడు తా వెడలే। అక్కడ వెడలికంసుడు తన నగరికి
యేతెంచే। పూతకినప్పుడుబంపెను భూకల్పునిజంపా। చన్నునవి
షముంచుకు నుతియించెను పూతాకి। రేపల్లెవాకిటనూ యశోదా
కడనున్నా। ఉయ్యాలాలోనున్నా చిన్నికృష్ణమ్మను జూసే। రావో
యీ నందకుమారా రావోయీ రత్నకుమారా। రావో రాజుల
హంసా గమ్మనుచును పూతాకీ। ఆపలుకులువిని కృష్ణుడు అతివేగ
మ్మునవచ్చే। ఒక్కగుక్కకే పూతకివిషములు గ్రుక్కటబట్టే। రెం

డో గ్రుక్కకు పూతకి రక్తము గ్రుక్కిటబట్టే। మూడో గ్రుక్కకు
పూతకి ప్రాణము గ్రుక్కిటబట్టే। గుటక గుటకలవిమూడూ గుట
కలుగా దిగమ్రింగే। పెనుకొండావలె పూతకి పెరటింటిలో బడె
నూ। కొట్టివేసిరీ పూతకనీ గొడ్డళ్లా పారంతో। రాసులుగాపోయిం
ద్రీ రేపల్లెవాకిటనూ। పచ్చన్నము దెచ్చియో బాలునికీ దిగదుడచీ।
బాలింతకిబోసీరె పర్వతమ్ములాపొడవూ। ఎర్రన్నము దెచ్చియోబా
లునికీ దిగదుడచీ। చూలింతకుబోతూరే చుక్కల్లాపొడవూ నా। కం
సుడుబంపిన పూతకి కడువేగమ్మునజచ్చే। దండిగ కంసుడు బంపె
నురకర్కసుణ్ణీ వేగా। బండిరూపమైవచ్చే గుండెవిరగ దన్నితిన నె
నూ। పశువులబ్రాపకుల గా చెటిబకుణ్ణీ జీరితిన నెనూ। పాలదొంగిల
గసితెల్లిరోలగట్టెనుమద్దులనూ। రోలీడ్చుకుమద్దులనూ కూలగదన్ని
తిన నెనూ। పక్షులుఅంతరిక్షమ్మునపోవుచునుండగబూచీ। ఆగాలిసోకి
ననూ ప్రాణమ్ములుమూర్ఛల్లూ। అటువంటీకాళిందిలో అవలీలగదిగ
నురికీ। కాళింగునిశిరసునూ కడునాట్యము చేయుదునే। కంటకిదుండ
గీడానీకాళింగుని తన్నపుడూ। కాళింగునిసతులంతా కడువేగమ్ము
నవచ్చి। కానుకలిచ్చేము మేమూ కడువేగనాధునివదలూ। మాకు
పెండ్లీ శాయవెనూ ప్రాణావల్లభుకూ। ప్రాణమిచ్చికావవె భక్తవ
త్సలాయనుచూ। నీవుజేసినదీ పెండ్లీ నికరమ్మూ భద్రమ్మూ। చిన్ననా
టిదీ పెండ్లీ మరి పెండ్లిగాదనిపలికే। కాళింగునిమదమణచి కడువేగ
మ్మునఅతనీ। వారిధిబామ్మని ద్వీపాంత్రమ్ములు బంపితిననెనూ। దేవ
దేవమీమహాత్మ్యము తెలసీజెలయక నేనూ। తెలసీ మీపాదాసేవ
లుగోరితి ననెనూ। ఆపలుకులువినిమీకడ కంపితినేవిప్రుణ్ణీ। అతివే
గమ్మునరమ్మని అంపితినే విప్రుణ్ణీ। నాతిరో నీకేమైనా మనసులుకలి
గున్నానూ। నాగలోకమంతానూ సాధించీ తెచ్చేనే। ఇంతిరో నీకే
మైనా కోరికలుంటే జెప్పునూ। ఇంద్రలోకమంతానూ సాధించీ దె

చ్చేనే। ముందురా మావతోటములో మును పడిగిన కోరికలూ। త
మ్మునిపాండవులకిచ్చి చంపబంపితిరీమీరనేమూ। నాకేమీ కోరికలూ లో
కేశ్వరనాకీవ్రుడూ। రాత్రిపొగలూ గూడుండుటమీతోడనె కోరిక
లూ। సతిపతులిద్దరు గూడుకు సంతోషమ్మున యుండ్రి। నిద్రించెను
శ్రీకృష్ణుడు నీరజాక్షితోగూడా। సత్యాంగనబంపిన చెలి సరగు
న తాచను దెంచే। ముడచినపువ్వులు జారగ అలదినగంధము చెమ
ర్చా। బెదరిన అలలేడి పిల్లావలె వచ్చితివేమే। ఏమి కార్యమ్ములు నే
డూ ఇందీవారాక్షీరో। నాతోటీ జెప్పావే నాతో దూనీదారో।
అక్రూరొవినవమ్మా నానకిక మెక్కడి సంసారములే। చక్రధరుడు
న్నాడే అక్క రుక్మిణీ నగరానూ। ఉన్నాడే శ్రీకృష్ణుడు ఉభయ
మ్మూలాతోనూ। ఆపలుకులువిని చెలిగూడ ప్రాణమ్ములుమూర్చిల్లే।
గొల్లభర్తడువుకా మూర్ఛకొని తానప్పుడు దెలసే। ఎంతే ధర్మా
వతిరుక్మిణి అనిలోకులు మెన్నుదురూ। నాకు దెలసును రుక్మిణినైజ
ము లప్పలుకులునూ। మత్తిల్లి శ్రీకృష్ణుడు మందుల లోపల కిచ్చి।
మత్తైమామీద భ్రమలూపరచెనె గోపాలుండూ। పున్నమవెన్నెల
కాయగపొన్నలగున్నలనీడా। తిన్ననిస్వరమునఽప్పుడుకిన్నెరమీటు
చు మెరయా। కలకంఠుమతనతోడా।అలసీ మెలసున్నట్టూ।కలగన్న
ట్టాయగదే అలనాటీ ప్రేమాలనూ। అతిదుఃఖమ్ముతో భూమా భూ
షణమ్ములుసల్లించి। మైలవస్త్రమ్ములుగట్టెను మత్సరంబులాతోనూ।
పూరింటిలోనొకొక్క కీలడుగూ మంచమునా। అలకా గృహముల
కేగీ పవళించెను సత్యాంగ్నా। అక్కడ రుక్మిణినగరిలా అతివలం
దరును గూడీ। కనక కసువ్రులూ దుడచిరి కలయగ కస్తూరి జల్లి।
ముత్యాల ముగ్గులు బెట్టిరి మందగమన లందముతో। రాజరా
జ్యములానుంచి రాజఋషులూ దేవఋషులూ। తొల్లైనబ్రహ్మ

ఋషులూభూపతులూవచ్చెంచ్రీ। హోమకుండంబులుతవ్విరికొ
వ్వుగ ఎగ్రులుత్రమరూ। ఘృతమునకుండలునిలిపిరి కడువేడుకతోడు
తెనూ। సన్నబియ్యపుగోనెలురాసులుగాబోయించ్రీ। శ్రీకృష్ణుడు
మెడచుచూ అటగనువసుదేవుండూ। ఏవేళా శ్రీకృష్ణుడు వేలాస్త్రీల
తోనుండూ। ప్రియముతో పిన్నలపెద్దలపిలిపిస్త్రీనియపకీర్తి। బాలుని
తో సంసారముచేసుటఇదితప్పనెనూ। ఆపలుకులువిని చెలులూ అ
తిభయపడుచుచువెళ్లే। మేలిమైనకనకంపూపుడలదరికెతెంచీ। లే
చిరి కృష్ణా లెమ్మని చెలులందరు లేపగనూ। కల్లినుసుముదును లేచె
ను కడు వేడుకతోనూ। చప్పుడు గాకుండా తనసతిదాయకువచ్చె
తెంచీ। తొడ చరిచీ తెనసతినీ లేలెమ్మనుచును లేపే। సిరులాలికె
ముఖమునసనూ చెలువాడగ తీపీనీ। దటదట నడచిన రుక్మిణి చూచి
నెయ్యముకృష్ణుండూ। నాతిరో స్త్రీలకునెల్లా మెల్లగ నడువగవలె
నూ। గర్భిణిస్త్రీలకు నెల్లా కదలక నడువగవలెనూ। కొడుకూ
కోడలుయిద్దరు మేడమెట్లు దిగిరాగా। కన్నులపండువలా వసు
సుదేవుడు దేవకికి। పనిచారుల బిలపించీ సవతుల తోడితెమ్మనెనూ।
ఆపలుకులువిని చెలులూ ఆనందముపడుతూనూ। అక్కడవెడలి చె
లులూఅతిసంభ్రమముతోడుతనూ। సత్యాంగనఅయినట్టి సత్యాంగ
నవగరికివెళ్లి। అక్కరో వినవమ్మా మనఅక్కకుసీమంతములూ। కా
యగవలెనని కృష్ణులు ఊముగాబంచెనువేగా। అక్రూరునినగరికివిం
దుకుఆరగింతమనివెళ్లి। మానుబాంకించీముల్పుదువనజాక్షుడు రా
వెన్నే। అటువంటిశ్రీకృష్ణుకుఅతడేలారాబంపూ। అక్కరుక్మిణిబం
పిందనిపలికెనుసత్యాంగనతానూ। కోపుబి కృష్ణునిమీదను కోపించీ
రానసెనూ। నివు రాకుంటే మేలని తరుణులువవ్వుచుజనిరీ। అక్క
డవెడలిచెలులూఅతిసంభ్రమముతోడుతనూ। రాధాంగనమైనట్టి రా
ధాంగననగరికివెళ్లి। అక్కరో వినవమ్మా మనఅక్కకు సీమంతము

లూ। శాయగవలెనని కృష్ణులుమిము రాబంపెను వేగా। ఆపలుకులువిని రాధా ఆనందముతో దుతనూ। పలువిధభూషణములు శృంగారించెను వేగా। అక్కడ వెడలీచెలులూ అతిసంభ్రమము తో దుతనూ। భద్రాంగనయైనట్టి భద్రాంగననగరికి వెళ్ళి। అక్కరో వినవమ్మా మన అక్కకు సీమంతములూ। శాయగవలెనని కృష్ణులు మిము రాబంపెను వేగా। ఆపలుకులు వినిచెలియా అతిసంభ్రమముతో దుతనూ। అతివతెనాభరణమ్ములు వేగాయలంకరించుకునీ। జిలుగుబంగరూపోకా చీరెగట్టెను వేడుకతో। అక్కడ వెడలిచెలులూ అతిసంభ్రమముతో దుతనూ। మిత్రయైనట్టి మిత్రవిందనగరి వెళ్లి। అక్కరో వినవమ్మా మనఅక్కకు సీమంతములూ। శాయగవలెనని కృష్ణులు మిము రాబంపెను వేగా। అక్కడ వెడలీచెలులూ జాంబవతినగరికి వెళ్లి। అక్కరో వినవమ్మా మనఅక్కకు సీమంతములూ। శాయగవలెనని కృష్ణులు మిము రాబంపెను వేగా। అక్కడ వెడలీ చెలులూ కాళిందీనగరికివచ్చి। అక్కరో వినవమ్మా మనఅక్కకు సీమంతములూ। శాయగవలెనని కృష్ణులుమిము రాబంపెను వేగా। అక్కడ వెడలీచెలులూ సూదంతీనగరికి వెళ్ళి। అక్కరో వినవమ్మా మనఅక్కకు సీమంతములూ। శాయగవలెననికృష్ణులు మిము రాబంపెను వేగా। అక్కడ వెడలీచెలులూ అతిసంభ్రముతో దుతనూ। పదియరువేలా స్త్రీలకు చెప్పిరి వేడుకతోనూ। అక్కలార వినరే మనఅక్కకు సీమంతమ్మూ। శాయగవలెనని కృష్ణులుమిము రాబంపెను వేగా। ఆ డేటసొగటాలూ అతివలనెత్తా మగరీ। అతివలుయాభరణంబులు యలంకరించుకు వేగా। జిలుగుబంగరూపోకా చీరెలు గట్టిరి వేడుకతో। పలువిధభూషణములుసొగసుగశృంగారించిరి। పళ్లుఫలమ్ములు బంగరుపళ్లెరములనుంచుకునీ। కదలిరిపదియరువేలా కదు వేడుకతో దుతనూ। కృష్ణునిపట్టపురాణులు పదియరువేలాకగురూ। నడువగ రజము ధూళీ దినకరు క

లరఁగఁగప్పే। పగలే అస్తామయమూ ఆమెమయిది యేమనెనూ। ఆ
శ్చర్యమ్ములబడుచూ ఆకాశముబజూచిరి। కృష్ణునిపట్టపు రాణులు
పదియారువేలారుగురూ। నడవగ రజములధూళీ దినకరు గలయ
గగప్పే। సీమంతపు హెూమమ్ములు వేళ్చేటి చోటికినీ। కదలిరి పదియా
రువేలూ కడు వేడుకతోడుతనూ। శ్రీకృష్ణుడు శ్రీరుక్మిణి జలకమ్ములు
యాడగనూ। గంధమ్మూ కస్తూరీ కాంతలు నలుగిడుదురూ। సుగంధిజ
లములరుక్మిణీదేవికి జలకములార్చ్చి। నిండువన్నె తల్లొత్తిరి నీరజా
క్షికి వేడుకతో। బంగరుపట్టుపీతాంబరము కట్టనిచ్చిరి వేడుకలా। సఖి
యకుతలకుమలార్చ్చిరి సంపెంగావిరులానూ। బంగరు మొగలీరేకు
ల పటుసవరపు కొప్పికిరీ। ఇరుగడలా సూర్యాచంద్రాదుల నమ
రగసిలిపి। హరిశ్చంద్రాముత్యాలాబొట్టును మెరయగనుంచ్రీ। కెళిం
చిన ముత్యాలూ బావిలీలు మెరయగనూ। శశిపువ్వ పెరగనుం
చెనుచంద్రవదన వేడుకతో। మూపునతీగెలు బెట్టెను మగ్ధరాలు వేడు
కలా। ఒడ్డాణమ్ములు బెట్టెను వైడూర్యమ్ములు మెరయా। ఒత్తులుభు
జకీర్తులు బెట్టెను వైడూర్యమ్ములు మెరయా। పాదమునందెలు బెట్టె
ను పాంపట్టమ్ములు మెరయా। నెనులను కులపిల్లాళ్లూ నవముద్రిక
లు మెరయగనూ। చిటికెనవ్రాద్దులు బెట్టెను శ్రీరుక్మిణి తనవ్రేళ్లా।
పంచరత్నమ్ములు భటువులు పంకజాక్షి ధరియించీ। కస్తురితిలకము
దిద్చెను కమలాక్షి తన నుదుటా। సోగకన్నులా సన్నపు కాటుకల
మరగదిద్చీ। చేడెకు చంద్రాకావీరవికె దొడగిరీ వేడుకతో। శృం
గారమ్ములు జేసిరి శ్రీరుక్మిణి దేవికినీ। సీమంతపు పీటలపైగూర్చుండా
తమరుంచ్రీ। పళ్లుఫలమ్ములు రుక్మిణివడినింపిరి సవతులునూ। హాస్యం
బులవారెల్లా హాస్యమ్ములు చేయుదునూ। పరిహాస్యంబుల వారూ
గోపాలుని తమరపుడూ। మంగళహారతు లిచ్చిరి మగువలు గో
పాలునికీ॥

## మంగళహారతి.

అంగనాలు ముద్దు శృంగారమిందనీకు। సంగాతిగామెంతో రం
గామూనా। కొంగుబట్టిచిన్నా గోపికాలిండ్లాలో। దొంగా తాన
ముకాయా దొరవా రా శ్రీకృష్ణా॥ మంగాళం మంగాళం॥ ముద్దు
లకృష్ణా మంగాళం మంగాళం॥ అందియానావాలూ పొంచీ యి
ల్లాజొచ్చీ నేననచూవచ్చీ। మంచీపాలాకడవా అంచూనోటాబట్టీ।
వంచూకూతాగీనా వరదూడవాకృష్ణా। మంగాళం మంగాళం॥
ముద్దులకృష్ణా మంగాళం మంగాళం॥ పాలూమీగాడంతా చాలా
మూతికి రాసి। వేలూజూపీ దానీగేలూజేసీ। చూలూ నిల్పి చిన్ని
బాలూముగలదానీ కోలాహలము కాయా గోపాలా శ్రీకృష్ణా॥
మంగాళం మంగాళం॥ ముద్దులకృష్ణా మంగాళం మంగాళం॥ ఇ
ల్లూజొచ్చీ గొల్లా యిండ్లాపై పూలచెండ్లూవేసీ పాలున్నా
బట్టీ। కళ్ళూచూపీ వెన్నా కడవాలన్నీ పెరుగూదొళ్లాబాడచీనట్టి
దొంగావురా కృష్ణా॥ మంగాళం॥ పీటాలెత్తూబెట్టి పెరుగూ కుం
డకుచిన్నీ తూటూబాడచీ క్రిందా దోసీలొగ్గి। సూటీగానూ గూ
డీ సుదతూలాయిండ్లాలో నేమైనా క్షీరాబ్ధి సిలయూడందురు కృ
ష్ణా॥ మంగాళం మంగాళం॥ రాచాకొలులచె రమణూల గొందరి
నీ భాషాబంధించీ వనమందూ తిరుగుదుమా। వాసీగానూ గూడీ వ
లువాలు కొందరివి మోసా బుచ్చీవట్టీ ముద్దూలా శ్రీకృష్ణా॥ మం
గాళం మంగాళం॥ చెట్లాలో పలనిలచీ బొమ్మైకోకలుబూనీ చెట్లా
కగి। అట్టైరమ్మనిపిలచీ అతివాలా నీవలుదు కొట్లాకోర్చీనట్టి గో
పాలా శ్రీకృష్ణా॥ మంగాళంమంగాళం॥ ముద్దులకృష్ణా॥మంగాళం॥
మంగళహారతులిప్పిరి మగువలు గోపాలునికి। సత్రాజిత్తుని పు
త్రిక సత్యాంగన మేదనిరి। కోమలి శ్రీకృష్ణునిపై గోపించీ రానని
మా। కొడుకూబక్క డెగానీ కోడళ్ళూ పెక్కండ్రూ। నగధరునీ

శృంగారము నగరం తాసింఢినదీ। ఇందరు యింతులలో పల రూపసి
యెవరని పలికే। నెమ్మత్రైనా కొప్పాది నెమలీపురికుంచాదీ। వెనుక
కులంగారూ చిత్తరవులుగలిగినదీ। తెనభారవుపలుకులకూ తరుణీ
ంగొ నైయుండూ। కోమలిరుక్మిణి చక్కనిదని పలికెను కృష్ణుం డా।
ధనటంకంబులుకొన్ని ఘనరత్నంబులుకొన్ని। బంగరు తబుకులతో
నూ పంచిబెట్టించెను రాజూ। కన్యాదానంబులకూ కడులేనివస్త్రవ
లూ। బంగరుతబుకులతోనూ పంచిబెట్టించెను రాజూ। భూదానం
బులు కొన్ని గోదానంబులు కొన్ని। వేడుకతో వసుదేవుడు చే
యించెను తానపుడూ। వచ్చినవారికి నెల్లా పాకంబులు చేయిం
చే। అప్పమ్ములు అతిరసములు బొబ్బట్లు వటచిటిబూర్లూ। గొప్పప్ప
డమ్ములు మొదలుగ వండెను దేవకిదేవి। వెన్నప్పమ్ములు మంచీమను
గుపూవులాతోనూ। వచ్చినవారికి నెల్లా పాకంబులు జేయించే। ఎల్ల
రాజ్యంబులనుంచీ యేతెంచిరి భూపతులూ। వేడుకతో గోపా
లుని బంతులుసాగించిరిగా। దివ్యాన్నమ్ములు పెకూర-పిండివంటలు
కూరగాయలనూ। పచ్చళ్ళూ మొదలయినా పంచభక్ష్యపరమాన్న
ములూ। దధిమధుఘృతసూపమ్ములు వడ్డించిరి యింతులనూ। ఆర
గించివారెల్లా హస్తంబులు గడుగుకునీ। పాలువెయ్యిస్తంభములా
మేడలలోకి తెంచ్రీ। చిరిచాపలూమంచీ రత్నకంబళ్లూ బరపించ్రీ।
సవతులనందరినీ తా కూర్చుండగనియమించే। కర్పూరపు వీడెమ్ము
లు కాంతలకూ యిప్పించే। మణిరత్నంబులు కొన్ని మణిహారంబు
లుకొన్ని। మేలిమైన చీరెలతో కట్నమ్ములు యిప్పించే। కట్నంబులు
అందుకునీ కాంతలు సంతోషమునా। పుత్రుడు గలిగిననాటికి అ
కటారీ వత్తుము అనిరీ। సీమంతము జాడగనూ కన్నులకరువులు దీ
రే। సంతోషమ్ములు మాకూ సెలవులు యొసగవె అనిరీ। సెలవులు
బుచ్చుకు చెలులూ ఆనందముతోడుతనూ। అందరు గూడుకు తమ।

తేమ గృహములకే చనుదెంచ్రి । పంకజాక్షి రుక్మిణి తన పతికడ కూ చనుదెంచే। సత్రాజిత్తుని పుత్రిక సత్యాంగన యలిగివదీ । ప చ్చలపతకము లిచ్చెద పరమాత్మా మీకనెనూ । భామామణిరో స త్యాభామకు అలకలుదీరవు। పాషాణముఅసత్యాభామామణికోప మ్మూ। భామకుఅలుకలుదీర్చ్చా అదినాతరమే గాదూ। నక్షత్ర కంఠ మాలా సగముశృంగారముదీసీ। పంకజాక్షిరుక్మిణితనపతిచేతికివం దిచ్చే। మెచ్చుచుకోమలి గుణములనవ్వుచు గోపాలుండూ। సాలు వెయ్యిస్తంభాలా మేడలదరికే తెంచ్చే। తాళాలూతప్పెట్లూ దరు వులుమ్రోయగ లేమా। అలిగినదోసత్యాంగన అనుచునుగోపాలుం డూ। కీరములేపలుకావూ కోవిలలేనుయ్యావూ। హంసలు అందం దాడవు అనుచునుగోపాలుండూ। శృంగారము వెయిటల్లా నపుర్చ ...క్రిష్ణుండూ। అతివను ... దగ్గను మధుసూదనుడప్పా డూ। ఇంతులార మిమ్మేలెటి ఇంతేదనియడిగినదూ। ...శ్రీకృష్ణ డా బోయెనాయని పలికిరిచెలులంతా। ఇందరు ఇంతులనేలుట ఇ దికీడనెకృష్ణుండూ। అతిడగుగ్రిందైకృష్ణుడుఅతిడగుగ్రిందైటలికే। ఆప లుకులువిని చెలులూ అతిభయపడుచూవచ్చి। వాచానామేమెరుగ ముచెయిసంజ్ఞలమాపించే। పూరింటిలోనోక్కాకీలడుగూ మంచ ముపై । అలకగృహంబునకేగీ సత్యాంగన బవళించే । తలుపు క్రిందపామాయీ సర్వేశుడు తావెళ్లే। ఇంతిచేతి వీవనదూ పుచ్చు కుతానేవిసరే। ఇందాకాలేనివింతా యీవింతా వాసనలూ। విం తవాసనలకు ముసుగూ తొలగించీ తా జూచే । హరియని తెలసీ భామామల్లీ ముసుగులుబెట్టే। యింతకన్నా రుక్మిణికీ యేమిచను వులు యిచ్చేనే। పదిమందిదాసీలేపణతిరుక్మిణీనగరా। పదివేలవా సీలే పంకజాక్షినీనగరా। నవరత్నపు భూషణమ్ములు నాతిరొసిగడ పలనూ। కోమలిరుక్మిణి దేవికి భూషణమ్ములు సహాలేవే। బంగార

వు మేడాలే పసిడిమిద్దెలేకొన్నీ। సర్వరాజ్యవైభోగము సతినీ వాడనె నేనూ। మంగళవతులైనట్టి మగువలకల్లానిపుడూ। శృంగారము మొన్నదునూ చెవిరుండగరాదనెనూ। కలవరేకుల బోరెటి కలికి రొనీకన్నులకూ। కాటుకకన్నులనీరూ గారుట యిదియేమనెనూ। ఆ పలుకులువిని చెలియా అతిదుఃఖమ్మునబలికే। అక్రూరుమనగరికివిందులు ఆరగింతుమనివెళ్లి। మమ్ముబొంకించీ వేగావనజాక్షా మీరువెళ్ళి। అక్రూరుడెసతియూమెన అతివేగమ్మునమీకూ। అక్రూరుడె వసియూడెటి నడుమక్కడ నడిగితిరో। ముందుగచెలులకు లంచము యివ్వక నేమోసపోతీ। ఏకాంతపు గృహములకూ యేగితినీ యనెనూ। పచ్చలపతకము దెస్త్రిని పంకజాక్షిరో చూడే। అందుకునీ ఆ భామా ఆనందము బడుచూనూ। సతిపతులిద్దరు గూడుకు సంతోషమ్మునమంత్రీ। నిద్రించెను శ్రీకృష్ణుడు నీరజాక్షియు వేడుకతో అక్కడవసుదేవకి తన ఆత్మసెలుల బిలచుకునీ। కాంతలో మన రుక్మిణికీ నవమాసమ్ములునిండే। శ్రీకృష్ణుడు లేడామెను తోడుకురమ్మనిపలికే। సత్యభామనగరికినీ సరగునతమరే తెంచీ। నిద్రించీ యున్నట్టి నీరజాక్షునీపొడగాంచీ॥

## మేలుకొలుపులు.

బంగారూచెంబుతో పన్నీరుబట్టూకూ పణతిరుక్మిణివచ్చే మేలుకో॥ రంగైనాపావలూ కొంగేలాబూనూకూ రమణిసత్యాతోనూ। మేలుకో। దంతాకాష్టమ్మూబూనీతామ్రారానాక్షి సూదంతివచ్చిన దయ్యామేలుకో। అంతాకుమున్నూరూకూలా బట్టుకుజాంబావంతూని సుతవచ్చేమేలుకో॥ అందామైనా నిలువుటద్దామూగొని మిత్రావిందావచ్చినదయ్యా మేలుకో। పొందుగాకస్తూరిభరిణాబట్టుకు కాళిందీవచ్చిన దయ్యా మేలుకో॥ సూటీగానీపైనీ పాటాలూ బాడూతూ సూభద్రా వచ్చినదయ్యా మేలుకో। వాలాయముగ

తాంబూలాములట్టూకూ రాధాంగీవచ్చినదయ్యా మేలుకో॥ ముదముతో ఏతేవా యింపుమా శ్రీలక్ష్మి వచ్చినదయ్యా మేలూకో। వదియరూ వేలాగోపికలెల్లా సాగటాలా పాడి దెచ్చున్నారూ మేలుకో। మేలూకో యశోదా నందా కుమారా మేలూకో శ్రీకృష్ణా మేలూకో। మేలూకో దయతోడా వేగా గావచ్చేనూ తెల్లావారా వచ్చే మేలుకో॥

అని కాంతలు లేపగనూ విని కృష్ణుడు వేడుకతో। కాంతలవద్దకు వచ్చెను కడు సంభ్రమముతో డుతనూ। శ్రీరుక్మిణినెల్లాడగ వేకలాయెను శ్రీకృష్ణా। వసుదేవుడు దేవకి మిరు రాలం పెనుమమ్మా నెనూ। సంతోషమ్మున కృష్ణుడు సతి తైననను చెప్పకనూ। ఆనందమ్మున కృష్ణుడు అతి వేగమ్మున వచ్చె। నవమాసమ్ములు నిండెను నాటి శ్రీరుక్మిణికి। పంకజాక్షి రుక్మిణికి బాలుడు తానుదయించె। దశదినమ్ములూ గడచెను దేవకి మజ్జన మార్చె। పగడు మీద భారసాల చేసెను వసుదేవుండూ। మన్మధుడనుచును వారూ మరి నామమును నిడిరిగా। భూదానమ్ములు కొన్ని గోదానమ్ములు కొన్ని। అశ్వదానమ్ములు కొన్ని వరుసగ జేసెనరాజూ। కన్యదానమ్ములకూ కడు లేని వస్త్రములూ। బంగరు తబుకులతోనూ పంచిపెట్టించెనే రాజూ। వచ్చిన వారందరికీ పాకమ్ములు చేయించే। అప్పమ్ములు అతిరసములు ఒప్పుగ వటిబిటాబూరెలు। గాప్పప్పడమ్ములు మొదలుగ వండెను దేవకిదేవి। వెన్నదురుగు వెన్నప్పము సాజగుళ్ళులాతోనూ। వేడుకతో గోపాలుని బంతులనూ వడ్డించి। దివ్యాన్నమ్ములు పెరుగు పిండివంటలు కూరగాయలనూ। పచ్చళ్ళు మొదలయినా పంచభక్ష్య పరమాన్నములూ। దధిమధుఘృతసూపమ్ములు వడ్డించిరి యింతులునూ। ఆదధిఘృత సూపమ్ములు వడ్డించిరి ఇంతులునూ। అరగించి వారెల్లా హస్తములాగడుకునిరి। కర్పూర తాంబూలములూ కడు వేడుకతో నిచ్చిరిగా। అతిసంభ్రమముతో

ముతనూ అందరుతమగృహములకేతెంచ్రీ। శ్రీరుక్మిణిసీమంతము పాడినవారికినెల్లా । విన్నవారికినెల్లా విష్ణులోకమూ గద్దనెనూ। శ్రీరుక్మిణిసీమంతము పాడినవిన్నాగానీ। స్త్రీలకు పుత్రులుగలుగుదురని శ్రీకృష్ణుడుతాబలికే॥

శ్రీరుక్మిణీదేవి సీమంతము

సంపూర్ణము.

# ప్రకటన.

## విక్రయమునకు సిద్ధముగానున్న పాటల పుస్తకములు.

| | | |
|---|---|---|
| ౧ | కుశలవచరిత్ర (కుచ్చలకథ) | ౦-౬-౦ |
| ౨ | లంకాయోగము. | ౦-౨-౦ |
| ౩ | గుహ, భరతులఅగ్నిప్రవేశము. | ౦-౨-౦ |
| ౪ | పట్టాభిషేకము, సీతసురటి. | ౦-౩-౦ |
| ౫ | లక్ష్మణదేవరనవ్వు, ఊర్మిళాదేవినిద్ర. | ౦-౨-౬ |
| ౬ | సీతసమర్త. ... ... | ౦-౧-౦ |
| ౭ | సీతయానవాళ్లు. ... ... | ౦-౧-౦ |
| ౮ | శ్రీకృష్ణునిచల్దులు. ... ... | ౦-౧-౦ |
| ౯ | చిలుకరాయభారము. ... | ౦-౦-౬ |
| ౧౦ | రుక్మిణీదేవి సీమంతము. ... | ౦-౧-౦ |

౫, ౬, ౭, ౮ నెంబర్లుగలపాటలు తయారగుచున్నవి. కొంచెము రోజులలోనే విక్రయమునకు సిద్ధముకాగలవు.

ఈపుస్తకములు వాల్యూపేబిల్‌గా తెప్పించుకొనువారికి రెండణాలు పోస్టేజి అగును.

కావలయువారు విశాఖపట్టణనివాసులగు మ॥ రా॥ శ్రీ తాతాప్రగడ అచలంపంతులుగారిపేర వ్రాసి తెప్పించుకొనవలయును.